## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

"పల్లెటూరు గ్రంథమండలి"

# గాంధీజీ సూక్తులు



గ్రంథకర్త:

ముదిగంటి జగ్గన్న శాస్త్రి.

# గాంధీజీ సూక్తులు.



## ఆరోగ్యము

శీలములేని మానవుడు ఆరోగ్యవంతుడు కాజాలడు. మలినమైన మనస్సు శరీరమునుకూడ మలిన భూయిష్టము కావించును.

ఇప్పటి నాగరికత నిర్మల వాయువునకుకూడ. కరవు తెచ్చిపెట్టెను. మంచిగాలిని పీల్చుకొనుటకు మనము పట్టణములను వీడి దూరము పోవలెను. అనగా ధనవ్యయము చేయవలెను. గాలిని కొనవలెను.

ప్రతి నూరు రోగములలోను తొంబది రోగములకు దుర్వాయువే మూలకారణమని చెప్పుట కెంత మాత్రము సంశయము లేదు.

వేలకొలది రోగులు సూర్యాతపమునకును, విశుద్ధ వాయువునకును విడిచిపెట్టబడి నిరోగులగుటను మనము కాంచుట లేదా ?

మనలో నిరంతరము ఆత్మకును, అనాత్మకును (సైతానునకును) దేవాసుర యుద్ధము జరుగుచునే యున్నది. ఈ పోరులో ఆత్మ జయించెనేని శరీరము సదా మంచి కార్యము

లనే చేయుటకు సాధనమగును. సయితానే జయము నొందెనా! శరీరము అనేక దుర్వ్యాపారములకు నిలయమగును.

సయితానును ధిక్కరించి భగవంతుని చట్టములను పాలించినపుడే మనము పరిపూర్ణారోగ్యవంతుల మగుదుము.

నేను నా యావజ్జీవము అస్ఖలిత బ్రహ్మచారిగనే యుంటినేని యిప్పటికంటె వేయిరెట్లు ఎక్కువ జవసత్త్వములను కార్యోత్సాహమును కలిగి యుండెడివాడనని నా దృఢ విశ్వాసము. నాకును నా దేశమునకునుగూడ నేను మరెంతయో యుపకారినై యుండెడివాడను.

మానవుడు తిండికొరకే సృష్టింప బడలేదు. ఆతడు తిండికొరకే తన జీవితమును గడుపతగదు. సృష్టికర్తను తెలిసికొని యతనిని సేవించుటయే మానవుని కర్తవ్యము. భగవత్సేవకే శరీరము అవుసరము. కావున దానిని నిలుపుకొనుటకే మనము తినవలెను. నాస్తికులు కూడ మన యారోగ్య రక్షణకు కావలసినంత మాత్రమే మనము తినవలెనని యొప్పుకొనెదరు.

జిహ్వను కట్టినవాడు తదితర యింద్రియములను సులభముగ కట్టగలడు.

తిండి విషయములో మన మెన్నెన్నియో అనవసరమగు కోరికలకు దాసులమైతిమి. మన తిండిపోతుతనమును

దానికి దాసుల మగుటను మన మింకను గుర్తింపలేకనే యున్నారము.

భార్యపోయిన మానవుడును, భర్తపోయిన స్త్రీయు తిరుగ వివాహమాడరాదని ఆరోగ్యశాస్త్రము శాసించు చున్నది.

మన నిత్యజీవితమునకును మన యారోగ్యమునకును ఎంతయో సంబంధమున్నది. మనము పరిశుద్ధ జీవితమును గడపినగాని పూర్ణారోగ్యమును బడయజాలము.

భగవంతుడు మనకీ శరీరము నెట్టి పరిశుద్ధావస్థలో నొసగెనో యట్లే యతని కొప్పగించుటకు మన మెప్పుడును మన బాహ్యాభ్యంతర శుచిని కాపాడుకొనవలెను. మన సంబంధమును ఆతని యిచ్ఛానుసారముగ నెరవేర్చితిమేని మనకతడు అమరత్వమునే ప్రసాదించగలడు.

పరిశ్రమ లన్నింటిలోను కాలినడక రాణియైయున్నది. ఫకీరులు, సాధువులు సాధారణముగ బలముగ నుండుటకు ముఖ్యకారణము వారు దేశమంతయు కాలినడకను తిరిగి వచ్చుటయే యని గుర్తెరుగవలెను.

ప్రకృతియే మనకు చర్మమను దివ్యమైన యాచ్ఛాదన మొసంగెను దుస్తులు లేనపుడు శరీర మందవికారముగ నుండుననుకొనుట పొరపాటు.

అస్ఖలిత బ్రహ్మచర్యము లేనిదే స్త్రీపురుషు లెన్నటికిని సంపూర్ణ జవసత్వములతోను మానవ కళతోను శోభింప జాలరు.

శరీరము పరిపూర్ణాభివృద్ధినిగాంచి తరుణవయస్సు దాటినతరువాత మానవుడు రోజునకు రెండుసార్లుకన్న ఎక్కువ తినుట కెంతమాత్రము అవసరములేదు.

గాలి, నీరు, ఆహారము, మనకెంత ముఖ్యావసరములో నిత్య శరీర పరిశ్రమకూడ సంపూర్ణారోగ్యమున కంత ప్రాముఖ్యము.

శరీరమానసికముల విజృంభణమునకు తోడ్పడు పరిశ్రమయే ఆదర్శప్రాయమైన పరిశ్రమ. అదియే మానవునికి నిజమైన ఆరోగ్యము నొసగగలదు. వ్యవసాయదారే పూర్ణారోగ్యవంతుడు.

నారు పోసినవాడు నీరు పోయును. మన పోషణకు తగినంత ఆహారమును ప్రకృతియే కల్పించుకొను చుండును. కనుకనే తన భాగమునకు కావలసిన దానికి మించి తీసికొను వాడు యితరుల భాగమునుండి లాగికొనిన వాడగును.

మానవుడు మాంసాహారి కాజాలడని శాస్త్రవేత్త లనేకమంది నిరూపించిరి. అతడన్ని కూరగాయలను కూడ తిననక్కరలేదు. కందమూల ఫలాదులే యాతని ముఖ్యాహారము.

ఫలాహారమే యత్యుత్తమమైనదని నా యనుభవము వల్లను అధ్యయనము వల్లను నేను తెలిసికొంటిని.

తక్కువ తినుటవల్ల మన ఆరోగ్య మెన్నటికిని చెడిపో నేరదు. మనము సాధారణముగ తిను ఆహారమును తగ్గించు టయే అత్యావసరమై యున్నది.

మన యారోగ్యమంతయు భోగములకొరకును విషయ లోలత కొరకును మన శరీరమును జూచుకొని మురియుటకును లేక అదియే మోక్ష మనుకొనుటకును కాదు. అయినచో చెడురక్తముతో నిండి క్రొవ్విన శరీరములతో మనము మురియు టయే మోక్షమగును.

శరీరము భగవంతుని నిలయమని అన్ని మతములును చాటుచున్నవి. భక్తిశ్రద్ధలతో భగవంతుని సేవ చేయుటకే మన కీశరీరము ప్రసాదింపబడెను.

శీలము మంచి కార్యములపై ఆధారపడి యున్నది. మంచి కార్యము లెప్పుడును సత్యముమీద ఆధారపడి యుండును. సత్యమే అన్ని ఉదాత్త కార్యములకును పెన్ని ధానము. సత్య, ధర్మాశయములను నిర్భయముతో భల్లూకపు పట్టుతో కొనసాగించుటయే పూర్ణారోగ్యమునకు మూల కీలకము.

---

# గాంధీజీ సూక్తులు.



## ఆత్మ నిగ్రహము.

నీవు వివాహితుడవై తివేని నీభార్య నీస్నేహితురాలు, సహధర్మచారిణి, విషయభోగముల ననుభవించు పరికరము కాదు అను సంగతిని స్మరించుము.

ఆత్మనిగ్రహమే నీజీవితధర్మము. ఉభయులును వాంఛించునపుడే కలయిక జరుగవలెను. అదియును ఉభయులును అంగీకరించిన నియమములకు లోనై యుండవలెను.

నీవు అవివాహితుడ వైనచో నీకొరకు, నీసంఘము కొరకు, రానున్న నీ యర్ధాంగి కొరకు కళంక రహితమైన జీవితమును గడుపవలసిన బాధ్యత నీపై గలదు. ఇట్టి ధర్మమును నీవు గ్రహించిననాడు. ఇదియే నిన్ను మోహజాలము నుండి యమోఘముగ కాపాడగలదు.

మన మెప్పుడును చూడనప్పటికిని అంతర్యాముగ మన మందరమును గుర్తించుచున్నట్టి అప్రత్యక్ష శక్తి మన ప్రతిదుష్ట చింతను కనిపెట్టి లిఖించుచున్నట్లు సదా భావించుచుండుము. అప్పుడు ఆశక్తియే నీకెల్లప్పుడును సహాయ పడుచుండుటను నీవు చూడగలవు.

అధర్మ ప్రభుత్వముక్రింద ధనమును అధికారమును గడించుట పాతకమగును. అట్టిచోట దారిద్ర్యమే సుగుణము.

అత్యవసరము, ఆచరణీయమునైన స్వదేశీదీక్షను కొనసాగించుటలో తగినశిక్షను చాకచక్యమును, కార్యనిర్వహణశక్తిని మనవారు చూపించిన యెడల శాసనోల్లంఘనమును జయప్రదముగ సురక్షితముగ నడుపవచ్చును.

అసహాయవాది యెట్టి యుద్రేక కారణము నైనను సహింపవలెను. ఒకప్పుడు సోల్జర్లు ఈజిప్టులోని మసీదులో ప్రవేశించి యచ్చట జరుగుచున్న జాతీయప్రచారమును ప్రతిఘటింపనెంచిరి. ఒక యువకుడు ఉపన్యసించుచుండ సభ్యులందరును వినుచుండిరి. అతడు తన ప్రచారము నెంతమాత్రము చాలింపక సాగించుచుండ సోల్జరులాతనిని పేల్చిచంపిరి. ఆ సభలో నెట్టి కలవరమును కలుగలేదు.

అహింసతో సత్యమును చేప్పితివేని ప్రపంచకము నంతటిని నీపాదముకడకు తెచ్చుకొనెదవు

అన్నవస్త్రములు రెంటికిని సంబంధించినంతవరకు భారతదేశము తనపై ఆధారపడినదేగాని యామెకు ఆర్థిక స్వాతంత్ర్యమెన్నటికిని చేకూరనేరదు.

అగ్నివర్షమందైనను సత్యమునే పలుకవలెను. నన్నిలతో పొడుచుచున్నను సత్యపథమును వీడరాదు, స్వతంత్ర

సర్వస్వమును పరిత్యజింపరో వారు శాస్త్రముల నెన్నడును నిజముగా గ్రహింపజాలరను ఆర్యోక్తియందు నాకు ప్రబల విశ్వాసము కలదు.

అమాత్య శేఖరుడైన ప్రధానమంత్రి తన మాటలను తానే పాటింపకుండునుగాక! కాని తనజాతి తరఫున గైకొనబడిన శపథమును భంగము చేయుట కాతని కెంతమాత్రమును హక్కు లేదు.

అద్భుతమైన పరస్పర సహాయశక్తిని, నిర్మాణదక్షతను పెంపొందించగల మహోద్యమమును సమబుద్ధితోజూచి దానికి తోడ్పడుటకు మారుగ దానిని పరమద్వేషముతో ప్రతిఘటించుచు ప్రజాద్రవ్యమును వృధావ్యయముచేయుచుండుటే మన ప్రభుత్వముయొక్క అసర్వాతను శతవిధముల చాటుచున్నది.

అదేమి పాపమో గాని మనము 'కాదని' చెప్పు శక్తినికూడ గోల్పోయితిమి. 'కాదని' ప్రభుత్వమునకు చెప్పుట రాజద్రోహమే కాక మహాపాతకముగ గూడ పరిగణింపబడు చున్నది.

అన్ని దేశముల విజ్ఞానశంఖములను సర్వదా నాయింట స్వేచ్ఛగా పూరింపవలెననియే నాకోరిక.

అసహాయోద్యమమన ఆత్మపరిశోధనయే. కాని దో నది దోషయుక్తము నీతిబాహ్యమునైన యేహ్యపదమే యగును.

# గాంధీజీ సూక్తులు.

## సంఘసంస్కారణ

మానవ ప్రకృతిలోనే వర్ణాశ్రమ ధర్మము లున్నవని నా యభిప్రాయము. హిందూమతము దానిని శాస్త్రముఖ మున నంగీకరించెను.

ఒకరు ఎక్కువ ఒకరుతక్కువ యనుకొనుట మన మత విరుద్ధము. భగవత్సృష్టిలోని ప్రతి జీవరాశికిని సేవజేయుటకే మనము కల్పింపబడితిమి. జ్ఞానముతో బ్రాహ్మణుడు, రక్షణ శక్తిచే క్షత్రియుడు, కృష్యాదులచే వైశ్యుడు, దైహికసేవచే శూద్రులు యీవిధముగ వీరందరు సృష్టియొక్క సేవకులు.

నేను ఆపాదమస్తక పర్యంతము సంఘసంస్కారవాదినే. కాని నా సంఘ సంస్కారావేశము హిందూమతములోని ప్రధాన సిద్ధాంతములనే తెగనరకుటకు నన్నెప్పుడును ప్రోత్స హింపదు.

నేను మతముయొక్క బాహ్యకర్మలనుపట్టుకుని వ్రేలాడు వాడనుకాను మతముపేర జరుగు అన్యాయములను సమ ర్థింపజాలను. దయా, సత్య, శౌచ, బ్రహ్మచర్యాల నెవరు సంపూర్ణముగ తమ జీవితములో జూపజాలరో ఎవరు తమ

మోసము, అవిశ్వాసము యీ యుగధర్మములై యున్నవి. ఏమతమునకు చెందిన మనుష్యులైననుసరే బాహ్యవేషములనే మన్నించుచు మూలసిద్ధాంతములను తుంగలో నూరత్రొక్కుచున్నారు.

దేశభక్తి నా మతములో నొకభాగము. దేశభక్తిలేని మానవుడు పూర్ణమైన మతాభిమానమును కలిగి యుండ నేరడు.

మన మతమును పాటించుటలో భార్యాపుత్రులను విడిచిపెట్టవలసి వచ్చినను అందులో కఠోర మేమియునులేదు. అట్లు చేయుటయే ధర్మమని నా యభిప్రాయము.



అప్పుడు ధనవంతులు నిర్ధనులు అను హెచ్చుతగ్గులు లేక పోవును. కఱవు కాటకములులేక దేశము సుభిక్షముగనుండును.

ఆత్మావలోకనము చేసికొనుటయే మానవ ధర్మము. అతడు తనను తాను తెలిసికొని తన శరీర మానసిక ఆత్మాభి వృద్ధుల కెంతమాత్రము తడవుసేయక కృషి సలుపవలెను.

ఈ ప్రపంచములో మనమెట్టి కష్టములకు లోనైనను సత్య, ధర్మములలోనే మనము సదా ఆనందమును చూర గొనవలెను.

ఆహార వస్త్రములకంటె సుకృతములే మనకెక్కువ. ఆకలిగ నున్నప్పుడు తిండినిచ్చువానికంటె ధర్మకార్యములకు సమయముల కల్పించువాడే గౌరవింపదగినవాడు.

మంచిచేయువలెనను కోరిక, తచ్ఛక్తి బాహ్యమునుండి రాజాలదు. అదెప్పుడును మనలోనే యుండును. దానికి తగు దోహదమునుజేసి మనము దానిని పెంపొందించవలెను.

కోరికలను, మనభోగములను మితిమీరినట్లు పెంచు కొనుట మననాగరికతకు, మన విజ్ఞానమునకు మన స్వరాజ్య మునకు వ్యతిరేకము. వానిని తగ్గించుటే, త్యాగమే మన విజ్ఞా నమునకు ఆయువుపట్టు.

మనసా, వాచా, కర్మణా వ్యభిచరించని నియమా చరణమే ఆత్మ పరిపూర్ణతకు మార్గము.

# గాంధిజీ సూక్తులు.

## మతము.

హిందూమతము యితరుల నందరిని తన మతములోనికి లాగుకొనవలెననెడి మతము కాదు. ప్రపంచములోని మత ప్రవక్తల నందరును పూజించుట కందులో స్థానము కలదు. ఎవరిమత విశ్వాసప్రకారము, మతధర్మ ప్రకారము వారు దైవభక్తిని సలుపుచు యితర మతములతో పోరులేక శాంత ముగ నుండుటయే హిందూమతాదర్శము.

"లోకా స్సమస్తాస్సుఖినోభవంతు" అనుసూక్తి ననుస రించిన నిరంతరసేవయే యత్యుత్తమ ధర్మము.

ఫలాసక్తిలేని భక్తుడే నిజమైన దైవభక్తుడు.

మన మేకార్యమును జేయబూనినను నీతిబద్ధులము కావలెను.

స్వార్థపరుడై యితరుల యానందముపట్ల విముఖతను జూపునంతకాలము మానవుడు పశువులకంటె నధముడు. అతడు తన తోడివారల హితమున కెంత పాటుబడునో యంత యుదారపురుషుడగును.

సేవయందున్న మహోత్కృష్టతను గుర్తించితిమేని ధన రాసులను ప్రోగుచేయుట మహాపాపమని గ్రహింతుము.

రాగద్వేషములు నిన్ను తికమకలుపెట్టి వేధింప బ్రయత్నించునపుడు మోకరించి భగవంతుని సహాయము కొరకు బిగ్గరగ ప్రార్థింపుము. 'రామనామము' నా కమోఘమైన సహాయకారి. బాహ్యోపచారము కొరకు కటిస్నానమును చేయుము. ఇది రాగద్వేషములను వెంటనేయుపశమింపజేయును.

ప్రాతఃకాలముననను, నిద్రించుటకు పూర్వమును ఆరు బయట చురుకుగ నడచుట నభ్యసింపుము. పెందలకడనే నిద్రింపుము. వేకువనే మేల్కొనుము. బుద్ధి, ఆయురారోగ్య ఐశ్వర్యములు దీనివలన కలుగుననునది యమోఘమైన సామెత. తొమ్మిది గంటలకే పడుకొని, నాలుగు గంటలకే లేచుట మా నియమము. పడుకొనునపుడు కడుపు తేలికగనుండుట మంచిది. కనుక రాత్రిభోజనము సాయంకాలము ఆరుగంటలకే చేయుటమంచిది.

మానవుడు జీవరాశి నంతను సేవించుట కేర్పడిన భగవంతుని ప్రతినిధియను సంగతిని గుర్తించుము, స్మరింపుడు. ఈవిధముగనే యతడు భగవత్ప్రేమను, గొప్ప తనమును వ్యక్తముచేయవలెను సేవయే నీకానందమును చేకూర్చుగాక! అప్పుడు జీవితములో నీకిక నెట్టియానందమును అవసరములేదు.

—

ఆత్మనిగ్రహము గల జీవితమును నడుపు చట్టములకును ఆత్మ భోగముతోగూడిన జీవితమును నడుపు చట్టములకును సంబంధము లేదు. కనుక నీవు నీస్నేహితులను, నీచదువును, నీయాహార విహారములను నియమింతువు.

మంచివారి యొక్కయు, పవిత్రులయొక్కయు స్నేహము నే చేపట్టుము.

రాగముల నుద్రేకింపచేయు నవలలను, పుస్తకములను నీదరికి రానీయక మానవలోకము నుద్ధరించు పుస్తకములనే చదువుము. సంశయములను నివృత్తిచేయుటకు, నిన్ను నడుపుటకు నేదోయొక పుస్తకము నెల్లపుడును నీయొద్ద నుంచుకొనుము.

సినీమాలకును, నాటకములకును పోకుము. నీ శక్తిని వమ్ముచేయునవిగాక ఆత్మ నుద్ధరింపగల నామకీర్తన, రాగ సంపుటిగల భజనమందిరములే గమ్యప్రదేశములు.

జిహ్వానుతృప్తిపరచుటకుకాక ఆకలిని తీర్చుకొనుటకే మనము తినవలెను. భోగపరుడు తిండికొరకే జీవించును. నిగ్రహము కలవాడు జీవించుటకే తినును. కనుక నుద్రేకమును కలిగించు మసాలా ద్రవ్యములను, నిషాకలిగించు కల్లు, సారాయిలను ధర్మాధర్మములను నశింపజేయు మత్తు పదార్థములను విడిచిపెట్టుము. ఎంత భుజించుట, ఎన్నిసారులు భుజించుట ఇవి నియమింపబడవలెను.

మానవులవలె మనము జీవింపజాలనిచో చచ్చుటకైనను సంతోషముతో నంగీకరింపవలెను.

ఆత్మపారిశుద్ధ్యమే మోక్షమార్గము.

అస్పృశ్యతకు స్థానమిచ్చి హిందూమతము పాపమున కొడిగట్టినది. అది మనలను పతితులను గావించెను. దాని ఫలితముగా స్వామ్రాజ్యములో మనమే పంచములమైపోతిమి.

అధర్మమును, అసత్యమును, దౌర్జన్యమును రూపుమాపి స్వరాజ్యమును స్థాపించుటయే అసహాయోద్యమము యొక్క ముఖ్యసూత్రము.

ఆయనంతశక్తుని సింహాసనము మ్రోల నిలచినపుడు మన మేమి తింటిమో, మన మెవరిచే స్పృశింపబడితిమో యను ప్రశ్నకుకాదు మనము జవాబు చెప్పవలసినది. మన మెవరిని సేవించితిమి? ఎటులసేవించితిమి ? అను యగ్నిపరీక్షయే మన కొసంగబడును.

ఆచరణ శూన్యమైన వాచామాత్ర ఆదర్శగ్రహణము శవాలంకారము వంటిది. అది పైకి జూచుట కందముగా నుండవచ్చును. కాని యది రసవిహీనమైన పిప్పి. అదెట్టి ప్రబోధమును కలిగింపజాలదు.

ఆంగ్లభాషతో విద్యనుగరపుట మనకొంప ముంచినది. అది బుద్ధి జాడ్యమును కలిగించెను. విద్యార్థుల నాడీమండల

మునకు తగనిభారమును వారిపైనెత్తి వారిని కుంగదీసెను. అది వారిని పుస్తకములను తిను పురుగులవలెను ఇతరుల ననుకరించు కోతులవలెను తయారుచేసెను. సహజమైన ఆలోచనాశక్తిని కార్యధురీణతా సంపత్తును నాశనము జేసెను. చివరకు తనకు దెలిసినవిద్యను తన కుటుంబమునకు గాని ప్రజలకుగాని బోధించుటకు అనర్హులనుగ గూడ తయారు చేసెను. ఇంతేకాదు. విదేశభాషతో విద్య కరపుటచే స్వదేశములోనే మనవారందరును విదేశీయులై పోయిరి. ప్రస్తుత ప్రభుత్వముయొక్క మరపునకు రాని మహా విషాదాంత నాటకమిదియే.

ఆంగ్లేయులతో స్నేహప్రవృత్తితో నుండుటకు అంగీకరించెదము. కాని ఆస్నేహము, సిద్ధాంతములలోను ఆచరణలోనుకూడ సరిసమానుల ప్రవృత్తితో నుండవలయును.

ఆపన్నుడైన యొక్కదీనుని సేవించినను భగవద్దృష్టిలో మన మాదరణపాత్రులమే యగుదుము.

ఇతర జాతీయకార్యక్రమ మంతయు మారిన మారును గాక ! దేశదారిద్ర్యము పోవలెనన్న ప్రస్తుత రూపములోనున్న స్వదేశీవ్రతము మాత్ర మెన్నటికిని అట్లే యుండితీరవలెను.

ఇప్పుడు జరుగుచున్న పోరాటము మతమునకును, కుమతమునకును, అంధకారమునకును జ్యోతి స్వరూపమునకును అని యెరుంగుదురుగాక !

ఇతరుల నుద్ధరించుటకు పూర్వము నిన్ను నీవుద్ధరించుకొనజాలవేని వారి నుద్ధరింపలేవు సరిగదా నీవును వారితో పాటే అధోగతిని పొందుదువు.

ఇతరులయెడ దయాశూన్యముగ మాట్లాడు ప్రతి మాటకును, చేయు దుష్కార్యమునకును మనము క్షమాపణ కోరవలసి యున్నది.

ఈశ్వరుడు మానవుని తన భుక్తికొరకు కష్టపడమని ఉద్దేశించి పుట్టించినాడు. ఆవిధముగ నెవరు పనిచేయకుండ భోజనము చేయుచుందురో వారు దొంగలు.

ఉద్రేకింపబడిన ప్రజల దురారాధ్యమైన కోపానలము ఆంగ్లేయులపై గాక వారు పాలించుచున్న ప్రభుత్వపద్ధతి పైకి ప్రసరింపజేసినందుకు అసహాయవాదు లెంతయు వందనీయులు; ఆశీర్వాదార్హులు.

ఏ కొంతమందియైనను తామింతవరకు శిరసావహించుచున్న ప్రభుత్వమును నిరాకరించినచో దాదాపు తమ స్వరాజ్యమును నిర్మించుకొనినవారే యగుదురు.

ఎచ్చట ప్రేమ వెలుంగునో యచ్చట జీవితము స్ఫురించును. ద్వేషము వినాశకారణము.

ఎట్టి యుపద్రవములనైనను ధిక్కరించుటకు మనము సాధనోపేతులమై యుండవలెను. అట్టి వానికి వణకు జనించవలసిన పనిలేదు.

ఎప్పుడు భారతదేశ బాలబాలిక లందరును ప్రభుత్వ పాఠశాలల నొక్కసారిగ విడిచెదరో ఆదినమే మన దిగ్విజయ దినము. మన జాతీయభావములో నదియొక గొప్ప పరివర్తనమును సూచించును.

ఎవరికిని యపరాధమును కలిగింప నక్కరలేకుండ గోవును చంపుటకు వీలున్నచోట దానికంటె గొర్రెను చంపుట మేలుగా భావింపబడుచున్నది. అట్టిచో ననేకమందిచే మహాపాతకముగ భావింపబడుచున్నచోట మహమ్మదీయ మతగ్రంధముగాని తదితరమహమ్మదీయ ప్రపంచమందలి ఆచారముగాని విధించనప్పుడుభారతదేశములో గోవునేలచంపవలెను?

ఏవిజ్ఞానములోను మనవిజ్ఞానమున నున్నన్ని యమూల్యమణులు లేవు.

ఎట్టి దైహికబాధ చేకూరినను చేకూరుగాక! అది మనలను నిజమతమునుండి దొలగింపకూడదు.

ఏప్రభుత్వము ప్రజాపాలనలో తక్కువ జోక్యమును కలిగించుకొనునో అనగా ప్రజలకే ఎక్కువ స్వేచ్ఛ నొసంగునో అదియే శ్రేష్ఠమైన ప్రభుత్వము.

ఎట్టి నిరంకుశ ప్రభుత్వమైనను పాలితుల యామోదము లేనిదే నిలువజాలదు. ఆ యామోదమైనను సాధారణముగా ప్రభుత్వముయొక్క బలవంతముచేతనే యేర్పడును

గాని కేవలము ఐచ్ఛికము కాదు. ప్రభుత్వముయొక్క దౌర్జ
న్యమును నిర్భయముగ నొక్కసారి పాలితు లెదుర్కొందురేని
ఆనిముషముతో ప్రభుత్వముపని సున్నయగును.

ఎవరు సత్యము నేరీతిగ పాటింతురో వారు తత్ఫలిత
మును తప్పక పొందగలరు. కాని సత్య వేషమును ధరించు
వారు విఫల మనోరథు లగుదురు.

ఒక దురాచారమునుండి తొలగించుటకు మనమెట్టి
వ్యక్తినైనను గర్హించుట శాస్త్రసమ్మతమే. అట్టివాని సంప
ర్కమునుండి శ్రోత్రియులను కాపాడుట యుక్తము.

సూదిబెజ్జమున ఒంటె ప్రవేశింపవచ్చును. కాని ధని
కుడు మాత్రము మోక్షమును బడయుట దుర్లభము.

ఒకజాతి మరొకజాతి కెన్నడును స్వరాజ్యము నొసగ
జాలదు. అది యాజాతియొక్క యోధాగ్రేసరుల రుధిర
ప్రసారముచే సాధింపబడవలసిన యమూల్య నిక్షేపము.

మనము కోర్టులలో నొందు జయము అపజయమే.
అట్టి అపజయము మృత్యు సదృశము.

క్రమశిక్ష, స్వార్థత్యాగము, అప్రతిహతేచ్ఛ, వినయము
యివి లేకుండ మనకు సంపూర్ణ జయ మెన్నటికిని కలుగదు.
ఆగుణములను సంపాదించుటకు ఉపవసించుట, ప్రార్థనసలుపుట
యీరెండే యనుంరితోపాయములు.

కోర్టులను వీడని న్యాయవాదులకు హృదయ మున్నది. కాని శరీర దౌర్బల్యము వెనుకకు లాగుచున్నది. కనుక ముందు వెనుక లెరుగని పరిపూర్ణమైన త్యాగయజ్ఞమును కోరు మన యుద్యమమును వారు క్షీణింపజేయగలరు గాని పెంచజాలరు.

కష్టముల ననుభవింపగల శక్తిని మనము చూపితిమి. మన మనుభవింపవలసిన దింకను నెంతయోకలదు.

గుడిని మ్రింగినవానికి గుడిలోని లింగమెంత? మృత్యు భయము లేనివానికి జైలు భయ మెక్కడ? మృత్యు భయముతో కృంగిపోయిన దేశము స్వరాజ్యమును సంపాదింప నేరదు. సంపాదించినను దానిని నిలుపుకొనజాలదు.

గృహపరిశ్రమలు లేనిచో హైందవరైతులు నశించెదరు. భూమినుండి సంపాదించుకొన్న దానితో జీవించుట కష్టతరము. వారికి మరొక చేతిపరిశ్రమ అత్యావసరమై యున్నది. రాట్న పరిశ్రమయే సులభమైనదిగను చౌకయైనదిగను యుక్తమైనది గను యున్నది.

జాతీయ ప్రబోధమును గాంచి, తమ హక్కులకొరకు సర్వస్వమును ధారవోయ సమకట్టిన ప్రజల యాశయములను అల్లిబొల్లి కబుర్లను టక్కుటమారి విద్యలును మోసపుచ్చ గలవా?

తమ యధికారులచేత ప్రజలపై గావింపబడిన దుర్న్యాయ దురంతముల నన్నిటిని సమర్థించు ప్రభుత్వముతో నొక్క క్షణికమైనను యెట్లు సంపర్కమును గలిగించుకొనగలము?

త్యాగాగ్నిచే పునీతము కాకుండ ఏదేశమును అభ్యుదయమును గాంచలేదు.

తప్పిదము చెదుగువలె రహస్యముగా ప్రబలును. అది బహిర్గత మయ్యేనేని నశించును.

తమతో సరిసమానమైన ప్రపత్తితో నుండవలెనను భారతీయుల కోరిక ఆంగ్లేయులకు వెగటుగా నుండును. శ్వేతాధిక్యత వారి కొకమతమై పోయినది.

తమ మాతృభాషలో గాక ఆంగ్లభాషలో తండ్రులు పుత్రులకుగాని భర్తలు భార్యలకుగాని యుత్తర ప్రత్యుత్తరములను జరుపుట యసహ్యాకరము.

తన్నిన కాలును ముద్దుపెట్టుకొనుటకు తిరస్కరించుటే మన తప్పిదము. నిర్మలాంతఃకరణతో గూడిన సహాకారము వచ్చువరకు ప్రభుత్వముకు మనము సహాయము చేయకుండుటే మన నేరము.

తమ యధికారము నెంతమాత్రము మనము లక్ష్యము చేయజాలమని ప్రభుత్వము గుర్తెరుగునట్లు మనము భగీరథ ప్రయత్నములను సలుపుదుముగాక!

దేశమను శరీరమునకు వ్యవసాయము, నూలువడకుట అను రెండును రెండు ఊపిరితిత్తులు. వీటికి క్షయవ్యాధి రాకుండునట్లు ఎప్పుడును గట్టిప్రయత్నము జరుగవలెను.

హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, ఎవ రైనను, పరిశుద్ధ జీవితమును జీవించుటకు ధర్మముతో సహా కారము, అధర్మముతో సహాయ నిరాకరణము చేయుట ముఖ్యావసరములు.

దేశము క్రొత్తపన్నులను భరింపజాలదు. ఇదివరకు భరించుచున్న పన్నులే దుర్భరముగ నున్నవి.

ధైర్యము, సహనము, నిర్భయత్వము, వీని నన్నిటిని మించిన స్వార్థత్యాగము - ఇవియే మన నాయకుల లక్షణములు కావలెను

దౌర్జన్యము ఆత్మహత్యయే యని ప్రతివారును గ్రహించునట్లు చేయవలెననియే నాకోరిక.

దేశభక్తి యన్నను, మానవభక్తి యన్నను ఒక్కటే. నేను మానవుడను. కనుక దేశభక్తిని కలిగియున్నాను. అది ఎంతమాత్రము సంకుచితముగాదు. భారతదేశ సేవ జేయుటకు నేను జర్మనీకిగాని ఇంగ్లండునకుగాని హానిని జేయను.

దొంగ మన ప్రాపంచిక ఆస్తినంతను తస్కరించును. త్రాగుబోతు తనయొక్కయు తన యిరుగువాని యొక్కయు మానమునే హరించును.

ధైర్యవంతుడై విశ్వాసపూరితుడైన నేతవాడుగాని, చెప్పాలుకుట్టువాడుగాని విశ్వాసశూన్యుడై పిరికి న్యాయవాది కంటె నెక్కువ సుగమముగ దేశమును నడపగలడు. జయము ధైర్య, త్యాగ, సత్య, ప్రేమ విశ్వాసములపై నాధారపడును. ప్లీడరు ఎత్తులు, గుణకారములు, చాణిక్య చతురత, ద్వేషము, అవిశ్వాసముల వలననెట్టి లాభములేదు.

దార్జన్య రాహిత్యముయొక్క తత్త్వమునిరహంకారమే. దార్జన్య రాహిత్యమన భగవంతుని అండయే. ఇదియే అన్ని యుగములలోను మేరువుగా నుండెను. భగవంతుని సహాయము కావలయునన నమ్రతతోను వాస్తవమైన విచారభరిత మనస్సుతోను మనము భగవంతుని చేరవలయును.

దార్జన్యరాహిత్య మతము ఋషులకును, సన్యాసులకును మాత్రమే కాదు. అది జనసామాన్యమునకును సంబంధించినదే. పశుజాతికి దార్జన్యతత్త్వ మెటువంటిదో మానవజాతికి దార్జన్య రాహిత్యతత్త్వ మటువంటిదే.

నేడు భారతదేశము పరుల యిచ్ఛానుసారముగ నాడింపబడుచున్న మృతకళేబరము. ఆత్మ సంయమనము వలన భారత దేశ మాత్మపారిశుద్ధ్యము నొందునుగాక! అపుడు తనకేగాక మానవలోకమునకు గూడ ఆమె కళ్యాణసంధాయి కాగలదు.

నీతిని తిరస్కరించుచు న్యాయమును పురిగొల్పని మతవిశ్వాసమును దేనినైనను నేనంగీకరింపను. అవినీతికరము

కాకపోయినచో హేతువిరుద్ధమైన మత విశ్వాసము నైనను నేను సహింతును.

నాచేతిలోనే యధికార మున్నయెడల ప్రస్తుతమున్న పాఠ్య పుస్తకముల నన్నిటిని యొక్కసారి చింపివేతును. నిత్య గృహ జీవితమునకు సంబంధించులాగున పుస్తకములను వ్రాయ నియమింతును. వీటిని చదువుకొని బాలుడు వెంటనే తన పరిసరముల యందు తన విద్యను ఆచరణకు దెచ్చుచుండును.

నీవు విద్యార్థివిగాని, విద్యార్థినివిగాని యైనచో అధమ పక్షము రోజునకు నాలుగుగంట లైనను నూలువడకకుండ మామూలు చదువు చదువుకొనుట పాప మని తలంచవలెను.

నేను పునర్జన్మను కోరను. నాకు పునర్జన్మయే సంభవించునేని నే నొక పంచమునియింట పుట్టి వారి విచారములను వారి బాధలను వారిపై మోపబడుచున్న యనేక దురన్యాయములను నేనుకూడ పంచుకొనెదను. ఇట్లు వారిమధ్యనుండి వారిని, నన్నుకూడ యీదుర్భరస్థితినుండి రక్షించు కొనుటకు ప్రయత్నించెదను.

అన్నమో రామచంద్రాయని పొట్ట చేతబట్టుకున్న క్షుద్బాధ పీడితులను నేడు ఖద్దరు రక్షించును లజ్జాస్పదమైన

జీవితములనుండి మరలింపబడిన వారికది త్రోవజూపును. ఖద్ద రులో హృదయము కలదు. ఆత్మకలదు.

నేను దుర్బలునికి అండగాజేరి నిరపాయము, నిశ్చితము, సూటియైన కార్యకలాపము నాతనికి బోధించి యాతని కాత్మ బలమును చేకూర్చి పశుబలము నెదుర్కొనుట కతనిని శక్తి వంతునిగ జేయుచున్నాను.

అసహాయోద్యమము నామట్టుకు ఆపుదల కాలేదు. ప్రభుత్వము భారతదేశముపట్లను, మహమ్మదీయుల పట్లను, పంజాబు హత్యలనాడు గావించిన యపరాధము పట్లను, మాలిన్యమును తొలగించుకొని ప్రజేచ్ఛానుసారముగ వారి పద్ధతి మారనంతవరకు నది యట్లేయుండును.

నాకే యధికారమున్నయెడల నేను తేయాకు ఎస్టేటు లన్నిటిని ఆపివేసెదను. అక్కడనున్న యూరేపియను పిల్లలను చూచినచో భారతస్త్రీ లెట్టి యవమానములకు పాలగు చున్నారో తెలియగలదు.

నాలో నేకొంచెము హాస్యరసము లేకున్నను నేను చాలకాలముక్రితమే ఆత్మహత్యను గావించుకొని యుందును.

నా కధికార మున్నచో పాఠశాలలలో నన్నిపనులను కట్టిపెట్టించి బాలబాలికలచేత నూలువు వడకించెదను.

నూలుతీయు ఉపాధ్యాయులను తయారుచేసి రాటము లను తయారుచేయుటకు వడ్రంగులను ప్రోత్సాహపరచెదను.

ప్రాణము నొసగు రాటయంత్రములను ప్రతిగృహమునకు గొంపోయి యీ శిక్షణ నిచ్చునట్లుగా ఆ యుపాధ్యాయుల నియమింతును. నా కధికార మున్నచో గుప్పెడు ప్రత్తియైనను యితర దేశములకు పోకుండజేసి యిచ్చటనే నూలువడకించెదను. ఈ నూలును ప్రోగుజేసి నేతవాండ్రచేత నేయించుటకు డిపోలను పెట్టింతును. చాలినంతమంది శిక్షణనొందిన స్థిర బుద్ధులున్నచో హిందూదేశమునుండి దారిద్ర్యమును ఒక వత్సరములోనే పారద్రోలుదును.

నేను భగవంతుని సత్యముల నరయజూచుచున్నాను. నాకు మనుష్యునివల్ల భయమంతయు నశించినది. కనుకనే భగవంతు డసహాయోద్యమమునపట్ల నున్నాడని నా విశ్వాసము. నేనాతని సర్వవ్యాపకత్వమును జూచుచున్నాను.

నేను భారతదేశము యొక్కయు, లోకముయొక్కయు సేవకుడను. అట్టి సేవయందే ప్రాణములనువిడువ నుత్సహించుచున్నాను. నేను గ్రహించిన విధమున సత్యము నాచరించుట, ప్రకటించుట నావిధ్యుక్తము. నేనందుకొరకే ప్రయత్నముల జేయుచున్నాను. నేననేక ప్రాచీనసత్యములపై నూతనజ్యోతిని ప్రసరింప జేయుచుంటినని చెప్పగలను.

నామానవత్వము నమ్ముకొని యాత్మరక్షణను సేకరించుకొనుటకంటె నా సర్వస్వమును, నేనును కూడ నశించుటకు నే నంగీకరించెదను.

నామతము కారాగార మతము కాదు. అందులో సంకుచిత తత్త్వము లేదు. బలవంతమును లేదు. భగవత్సృష్టి లోని ప్రతి జీవికిని నందు స్థానము గలదు.

మీ సేవజేయుటకు నా ప్రేమయే నన్ను పురిగొల్పుచున్నది. నా సృష్టికర్త ప్రమోల నా జీవితమును సార్థకము జేసికొనుటకే నేను మీ కష్టములను, విచారములను, పంచుకొనుచున్నాను.

నిజమైన దేశభక్తి యుండి ధైర్యమున్నచో దౌర్జన్య రాహిత్యమును మతముగా స్వీకరింపక నీతిగా స్వీకరించినను నది జయింపవచ్చును.

నమాజు చేసినంత మాత్రముచేతను దేవాలయమునకు పోయినంత మాత్రముచేతను మత మనిపించుకొనదు. ఆత్మ తత్త్వమును బ్రహ్మతత్త్వమును తెలిసికొనుటయే మతము. నేతనేయు కళను నేర్చుకొనినగాని నేయువాడు కాజాలనట్లు కొన్ని సూత్రములకు కట్టువడినగాని యాత్మతత్త్వమును తెలిసి కొనజాలడు.

నిరాధారులగు లక్షలకు ప్రాణదాయి యగు చరకా ప్రయోగమే నిరాశాధూమమును పాఱద్రోలి ఆశాభాస్కరు నుదయింప జేయగలదు.

పాలు త్రాగువాడు మాతృస్తన్యము నంటిపెట్టుకొని యుండునట్లు నేనును నాభారతాంబ నాశ్లేషించి యుందును.

నాకు కావలసిన యాధ్యాత్మిక సంపత్తు నంతయు నామెయే ప్రసాదింపగలదు. నా మహదాశయములకు తగిన పరికరము లన్నియు నాకిచ్చుటనే కాన్పించుచున్నవి.

పశువులలో ఆత్మ నిద్రాణమైయుండును. కనుక దానికి పశుబలము తప్ప వేరొండు కానరాదు. మానవత్వము దాని కంటె యుత్కృష్టమైన యాత్మ తత్త్వముపై నాధారపడి యుండును. కనుక నాత్మబలమే మనబలము.

ప్రతిజాతికి నొక ధ్వజముండవలెను. దానికొరకే లక్షోప లక్షలు చనిపోవుదురు. అది యొకవిధమైన విగ్రహారాధన. అట్టిదానిని నాశనముచేయుట పాపభూయిష్ఠమైన పని.

ప్రతీకారము సల్పుటగాని నిర్వీర్యతనుజూపి తలయొగ్గు టనుగాని అసహాయువాది చేయజాలడు. దుర్దమ దురంత ప్రభంజనునిమధ్య స్థాణువువలె చలింపకయుండుటయే అతని కర్తవ్యము.

పిరికి పందవలె రక్షణను గోరుటకంటె యేభిల్లుని బాణ మునకైనను గురియగుటకే నే నంగీకరించెదను.

ప్రపంచమంతయు కాదనినను భగవంతుడు ధర్మస్వ రూపుడే. న్యాయమూర్తియే. ప్రజాబలము లేకపోయినను సత్య మద్వితీయముగా నిలుచును. అది స్వయంప్రకాశము.

ప్రజలు మన మనుకొనునంత మూర్ఖులుగను, జ్ఞానశూ న్యులుగను ఎన్నటికిని లేరు.

ప్రాచీనసామ్రాజ్యము లన్నిటివలెనే బ్రిటిషుసామ్రాజ్యముకూడ ఒకేపాతకమును గట్టుకొనుచున్నది. దుర్బలదేశములను వర్తకదోపిడీలతో పీల్చుటే సామ్రాజ్యతత్వము.

ప్రతి ఇంగ్లీషువానితో మనము యుద్ధముచేయుటలేదు. ఇంగ్లీషుజాతిని ధ్వంసముచేయావలెనని చూచుటలేదు. మానవున కుండవలసిన శరీరము, మేధ, హృదయము అనువానినే ధ్వంసముచేసిన యీ ప్రభుత్వవిధానమునుమాత్రమే ధ్వంసము చేయవలెనని మన సంకల్పము.

ప్రాణనష్టమైనను సంభవించునుగాక! దేశారిష్టకార్యములను వేటినికూడ ఆమోదింపజాలము.

కావలసినంత ప్రకృతిలో సంఘర్షణమున్నను ఆకర్షణము వలననే ప్రకృతి నడచుచున్నది. అన్యోన్యప్రేమయే ప్రకృతికి మూలాధారము. ధ్వంసము చేయుట చేతనే మానవుడు జీవింపజాలడు.

ప్రతితండ్రియు తనపిల్లలకందరకును దుర్భరద్రవ్యనష్టముతో పాశ్చాత్యవిద్యను గఱపుచున్నాడు. పిల్లలందరును ఎప్పుడో ఎన్నడో ఏమిసంపాదింతురో గాని తత్కాలములో తండ్రుల కెంతమాత్రము సహాయము చేయజాలకున్నారు. అతి దరిద్రభూయిష్ఠమైన మన దేశములోనున్న యీ పద్ధతి బహు ప్రమాదకరమై యున్నది.

ప్రజల నంధకార బంధురములోనికి దింపుచు వారికి జ్ఞానదానమును చేయుచున్నామని నటించు ప్రభుత్వపు టాటల సాగనియుట అన్యాయము.

ప్రభుత్వ పారశాలలో మన బాలు రవమానముల పాలు చేయబడుదురు. మన దేశమును బుద్ధిపూర్వకముగ దోచుకొనిన ప్రభుత్వాధికారుల యాధిపత్యముననే యీ పారశాలలన్నియు నడుపబడుచున్నవి. అట్టి పారశాలలనుండి మన బాలురను మాన్పించు టత్యవసరము. అట్టి పారశాలలలో చదువుటవల్ల ఒకొక్కప్పుడు మన పతనవేగము నిరోధింప బడవచ్చును. కాని పారశాలలలో జరుగుచున్న జాతీయావమానమును భరించు టెంతమాత్రము న్యాయముగాదు.

ప్రాణము నిచ్చుటకు శక్తిలేని మానవునికేజీవి ప్రాణము తీయుటకును హక్కులేదు

ప్రజలలో సత్యాగ్రహము స్థానము నేర్పరచుకొనినది. దౌర్జన్య, అక్రమ, శక్తులప్పుడే దాని ధాటీముందు వడవడ వణకుచున్నవి.

ప్రభుభక్తి యచలమగు సిద్ధాంతముకాదు. అది పరస్పరాంగీకారము. ప్రజలయెడల భక్తితాత్పర్యములను కనుపరచు ప్రభుత్వము వారినుండి ప్రభు భక్తిని చూరకొనును.

పవిత్రత జీవితమున కెంత ప్రాణాధారమో కార్యనిర్వహణమునకు కూడ అంత ప్రాముఖ్యమే.

ప్రజాభిప్రాయమే సంఘుపవిత్రతను, ఆరోగ్యమును కాపాడగలదు.

భగవద్భక్తుల యొక్కయు అకలంకాత్ముల యొక్కయు నిష్కారణ బాధయే ఫలించునుగాని ఉత్తమూక గోలవల్ల, గందరగోళమువల్ల ఇసుమంతయు లాభములేదు.

భారతాత్మ అవినాశి. భారతదేశమున కెంతశరీర దౌర్బల్యము వాటిల్లినను యెంత ముప్పుసంభవించినను తదాత్మ జయజయ ధ్వానములతో విజృంభించుచునే యుండును.

బానిసకు యజమాని గృహమంతయు జయిలేయను నట్లు నాకు భారతదేశమంతయు పెద్ద జయిలువలె నున్నది.

ఆంగ్లప్రభుత్వమున భారతయోధుల మానవకళ్యాణము నకు వినియోగించిన పాప మొకనాటికైనను కట్టుకొని యుండ లేదు.

భేదకల్పనల జేసి పాలించు నీతిపై బ్రిటిషు ప్రభుత్వ మాధారపడి యున్నదని నిష్పాక్షికముగ యొప్పుకొనిన హ్యూము దొరగారి వాక్యములను నే నెన్నటికిని మరువ జాలను.

భగవత్కింకరుల సేవ్య క్తిగాని, యేప్రభుత్వము గాని తమ సేవకులనుగా చేసికొనుట కెట్టి యధికారమునులేదు.

భగవంతుని యంత్యపరీక్ష అతికఠినమైనది. సైతాను యంత్యభ్రమ అతి సమ్మోహనకరము. స్వతంత్రత నొందుటకు మనము భగవంతుని యంత్యపరీక్షకు తాళవలెను. సైతాను యంత్యభ్రమకు లోనుగాకుండ నుండవలెను.

భారతదేశము తన స్వాతంత్ర్యమును గురించి యాలోచించుటకు పూర్వము తన ఆర్థికస్వాతంత్ర్యమును చేకూర్చుకొనవలెను.

బ్రాహ్మణులను జయించుటకు తన ప్రేమామృతవృష్టి చాలియుండనిచో తత్ప్రియత్నమున బుద్ధుడు తన ప్రాణములనే యర్పించియుండును. మహాసామ్రాజ్యమును ధిక్కరించి జీసను కంటకకిరీటన్యస్తమస్తకుడై సిలువపై ప్రాణములను వీడెను. నేనును జీసను క్రైస్తు మొదలగు మహావక్తల పథము ననుసరించి దౌర్జన్య రాహిత్యపద్ధతిపై నిరోధమును బూనితిని

భారతదేశములో స్వేచ్ఛా మానవునివలె చనిపోవుట కన్న ఘనతర మేమున్నది.

బ్రిటిషుప్రభుత్వము భారతదేశమునకు గావించిన యత్యాచార పరంపర లన్నియు భారతప్రజా హృదయాంతరాళమున నిప్పుడు ప్రధూమితాగ్నివలె యున్నవి. ఆయగ్నిస్వార్థత్యాగము, జాతీయైక్యతా రూపములను దాల్చి ప్రభుత్వము తమ పశ్చాత్తాపమును వెలిబుచ్చి హృదయపరివర్తనమును గావించుకొనుటో

లేక దేశమును వీడిపోవుటో చేయువరకును విడిచిపెట్టదని నా దృఢ విశ్వాసము.

మన పోరాటములను అనైకమత్యము ఇంకను అనేక యనర్థములను భోజన ప్రతిభోజనములును, అంతర్వివాహము లును యెప్పుడును మాన్పియుండలేదు.

అశ్లీలపాటలను, అవాచ్య సంభాషణలను వినుట బ్రహ్మచర్యమునకు భంగకారకము. భగవన్నామకీర్తన మొనర్చు టకు బదులు అశ్లీలము లాడుట జిహ్వా వ్యభిచారమగును. అట్లే ఇతర యింద్రియములకును వ్యభిచారదోషము కలుగు చుండును. ఇంద్రియ నిగ్రహమున్నవాడే నిజమైన మానవుడు. గుఱ్ఱమును స్వాధీనమందుంచుకొనలేక పడిపోవు గుఱ్ఱపురౌతువలె మనమున్నారము. కళ్ళెముచే దానిని స్వాధీనము చేసికొనగల రౌతు పడజాలడు. ఇంద్రియ నిగ్రహమున్న మానవుడు ధన్యు డగును.

బలము శరీరదారుఢ్యముచే నేర్పడజాలదు. అప్రతిహత మైన యిచ్ఛాశక్తియే బలము నొసంగును.

బలవంతులు శక్తివంతులు యనేక తప్పిదములనే కాక యున్మాద కార్యములను కూడ చేయుచుందురు, వారి క్రియలకు మనము ప్రతిక్రియ యొనర్పక ఐచ్ఛికముగ గౌరవయుతముగ శాంతముగ వాని ననుభవించినపుడే మనకు జయము కలుగును,

కాని యపరాధముల గావించు ప్రభుత్వేచ్ఛకు మాత్రము లొంగరాదు.

జాతులు బాధలోను కష్టములోను తప్పమె పుట్టి చుండును.

బహిరంగముగ గాని అంతరంగముగ గాని దౌర్జన్యమును పురికొల్ప నంతవరకు ఉరి స్తంభమునకు కొంపోబడినను మన నిశ్చితాభిప్రాయములను మనము ఖండితముగ బహిర్గతము చేయవలెను.

ఎట్టిరూపములో నున్ననుసరే మన పోరాటమునందు బలవంతము విసర్జనీయమే యగును.

భారతీయ అశాంతిని తొలగించుటకు తన్మూలకారణ ములను నివారింపవలెనే కాని తేనెపూసిన కత్తులవంటి ఉద్యోగ ములతోను చిన్నచిన్న హక్కులతోను దానిని కప్పి పుచ్చ చూచుట దుస్సాధ్యము.

బ్రహ్మయైనను మనకు స్వరాజ్యమును ప్రసాదింప జాల డని చెప్పుటకు నేను వెరువను. మనమే దానిని సాధించుకొన వలెను.

మన కొసంగబడిన సంస్కారాదికములు మనబుద్ధి నాశనమునకు వేయబడిన నల్లమందు మాత్రలు.

మనముచేసిన ప్రమాణమును జారవిడచి భగవంతుని యెడల పాపకర్మల మగుటకంటె దుర్బలులము పిరికిపందలము అను దోషము నంగీకరించుట బహు శ్రేయస్కరము. నీవు నీ నిజాత్మయెడల నసత్యవంతుడ వగుటకంటె ప్రపంచమున కసత్యవంతుడ వగుట అనేకలక్షలరెట్లు మంచిది.

మనము అసహాయులమని భావించుకొనుచుండుట చేతనే స్వరాజ్య సంపాదన వెనుకాడుచున్నది. ఆత్మవిశ్వాసమును పూనినతక్షణమే మనకు స్వరాజ్యము చేకూరును.

తిండి, గాలి లేకుండ మనము జీవించజాలనట్లు చేతి వడకు పరిశ్రమలేకుండ యీ ప్రాచీన భారతమునుండి దారిద్ర్యమును సాగనంపుటయును, ఆర్థిక స్వాతంత్ర్యమును సంపాదించుటయును బహుదుర్లభము. ప్రతియింట పొయ్యి యెంతటి అవసరమో రాటముకూడ నంత ప్రాముఖ్యము.

మానవుడు గావించిన యపచారములన్నింటిలోను స్త్రీలయెడల చేసిన యపచారమంత పశుప్రాయమైనది, అమానుషమైనది, పతనహేతువైనది వేరొండు గానరాదు. నా దృష్టిలో స్త్రీలుదుర్బలులుగారు. పురుషులకన్న స్త్రీలేయుదారచరితలు. నేటికిని వారే త్యాగమూర్తులు. విశ్వాసము, సౌజన్యత, రెండవకంటివా డెరుగని బాధననుభవించుట, జ్ఞానము వారియందు మూర్తిభవించెను.

మనము సీమగుడ్డల నెంతధనముతో గొనుచుందుమో మన నేతవానికి, వడుకువానికి నంత ధనములేకుండ జేసిన వార మగుదుము. పైగా వానికింకొకవృత్తినైనను జూపని పాపమును కట్టుకొనుచున్నారము.

మన దేశములో నొకడు అయిదు లక్షల రూపాయిల సంసారి యైనచో నతడు దేశమునుండి 95 లక్షలు విదేశములకు పంపి వేసెనని యర్థము.

మన యిరుగు పొరుగువారి దోషములను మనము మన్నింతుమేని మన యితర సహాయ మేదియు నక్కరలేకుండగనే ప్రపంచము బాగుపడగలదు.

ముప్పదికోట్ల భారతీయులు తమనిజసత్త్వము నొక్కసారి గుర్తించిన చాలును. వారు దాని నుపయోగించ నక్కరలేకుండ గనే స్వేచ్ఛనొందగలరు.

సర్వజనులు మూడు ముఖ్యవిషయములను పాటించుట న్యాయము. ఒకటి సత్యసంధత; రెండవది అన్యులను హింసించ కుండుట, మూడవది ఇంద్రియములను జయించుట.

మృత్యువను తలగడపై నేజాతి తల నిడుకొని నిద్రించునో అదియే యమోఘ జాతి.

యూరపు నేడు భగవచ్ఛక్తిని జీసనుశక్తిని గాక సైతాను శక్తినే ప్రవర్తించుచున్నదని నా నిశ్చితాభిప్రాయము. పైకి భగవద్వేషమునే వేసినపుడిక సైతాను ప్రభ దుర్నిరీక్ష్యముగదా!

ఎంతటి మహామహుడైనను తాను యౌన్నత్యమును పొందుటకు తగు సావకాశముల నన్నిటిని ఇంగ్లీషువారు లాగి పారవేసినప్పుడు వారిక్రింద మన దేశమునకు స్వాతంత్ర్యము యెన్నడును సంభవించదని నా యభిప్రాయము. అందుచేతనే మనలో యనేకమంది మన నిజసత్తాను మరచి ఇంగ్లీషువారిక్రింద మనమెంతకాలమో తగుశిక్షను పొందినగాని స్వపరిపాలన కర్హులము కామను వెర్రిభ్రమలో పడియున్నారు. నేడే మనము స్వపరిపాలనకు పూర్తిగ తగియున్నారమని నా ప్రబలవిశ్వాసము.

ఎంతటి నిరంకుశ ప్రభువైనను తన చేతబడినవాని సహాయమును బలవంతముగనైనను లాగికొననిదే సఫల మనోరథుడు కాజాలడు.

రణరంగములో మృత్యువు మోక్షప్రదము. జయిలు స్వాతంత్ర్య కవాటము.

దుర్బలునికి బలము చేకూర్చవలెనన్న క్షేమయవసరమే. కాని యవిశ్వాసకుని బలవంతముగ ప్రేమచే విధేయుని జేసికొనుట రాక్షసకృత్యము. తాత్పర్య మెరుగని మంత్రోచ్చారణ రసవిహీనము; నిరర్థకము. టాగూరుకవి యవిశ్వాసకులందరిని చరకామతమును గ్రుడ్డిగ నామోదింపక తిరుగుబాటుచేయమను టెంతయు సమంజసము.

రష్యాకాక ప్రపంచజాతులలో నేమూడు జాతులలో గాని తయారైనంత మంది కంటె నెక్కువ యోధాగ్రేసరుల

నొక నూరువత్సరముల క్రితము మన భారత పుణ్యభూమి తయారుచేసిన స్థితిని చూడుడు! నేటి దౌర్భాగ్యావస్థను పరికింపుడు! ఇంతకన్న యవినీతికరము, అంధకార బంధురము నైన స్థితి వేరొకటి యేజాతికిని యుండజాలదు.

మన మూహింపగలిగినంత సులభ సాధ్యముగ లక్షల కొలది గృహములకు ధనమును, పనిని సమానముగ పంచిపెట్ట గల శక్తి రాటచక్రమునకే గలదు.

వివేకదృష్టితో చూచితిమేని శాసనసభా బహిష్కార వాదులు తాము శాసనసభలలో నుండువో పొడిచివేయుదాని కంటె నుత్కృష్టమైన సేవను పైనుండియే చేయుచున్నారు.

మన దేశములోని చట్టములు విదేశవర్తక దోపిడీదారు లకు సేవజేయుటకే యుపయోగింపబడుచున్నవి.

విదేశవస్త్ర సమ్మోహము పారతంత్ర్యమును, దౌర్భాగ్యమును, నీటికంటె వేయిమడుంగు లధమాధమమైన పాతివ్రత్య భంగమును అనేక గృహములకు తెచ్చిపెట్టెను.

వాచాభిమానములో నెంత అర్థమున్నను, ఎంత ఆత్మ విశ్వాసమున్నను, అదియంతయు నిరర్థకమైనదే.

విశాలమైన యీ భారతదేశమందు ఎంతమంది యోగ్యులున్నారో అన్నిపక్షములకుకూడ తావుగలదు.

సూక్ష్మదృష్టితో చూచితిమేని ప్రస్తుత ప్రభుత్వము మన దౌర్బల్యముమీదనే ఆధారపడి యున్నదని గ్రహింప గలుగుదుము.

విదేశ వస్త్రము, విదేశపు నూలు నేడు మన దేశములో రూపుమాసినచో మన భారతపుణ్యభూమిలో ప్రాచీనకాలపు డక్కా-మస్లినులు మొదలగు చీనిచీనాంబరములు తయారగు శక్తి కెట్టి యాటంకములును యుండజాలవు.

వృథా వాదోపవాదములు గాక నిరపరాధుల బాధయే శిక్షించువారిని శిక్షనొందువారినిగూడ తరింపజేయును.

వేయిపాళ్లు దౌర్జన్యమునైనను నేనొప్పుకొనెదను గాని యొక జాతియంతయు నిర్వీర్యమగుటను సహింపజాలను.

విద్యార్థులు సహాయపడక పోయినను, ప్లీడర్లుకాని ధని కులుగాని సహాయము చేయకపోయినను, స్వరాజ్యసంపాదన దుర్లభము కాదు. అది యెక్కువగా వ్యవసాయదారులపైనను పాటకపు జనముపైనను నాధారపడియున్నది.

వర్తక దురాశచేత నొకమహాదేశమును, అందలి ప్రజలను నిర్వీర్యము జేయుటకంటె బ్రిటిషు ప్రభుత్వమును గర్హించుటకు మరేమి కావలెను.

శాసనసభలచాటున మరుగుపడియున్న నిరంకుశాధికారముకన్న సైనిక నిరంకుశాధికారమే కోటిరెట్లు సుఖప్రదము.

శరీరమునకు మలమెట్టిదో భారత దేశమునకు విదేశ వస్త్ర మట్టిదే. శరీరారోగ్యమునకు మాలిన్య నాశనమును గావించుటెట్లావశ్యకమో యట్లే భారతమోక్షమునకు విదేశ వస్త్రము నరికట్టవలెను.

శాసనసభలు దృఢమనస్కులను తయారుజేయు యంత్ర శాలలు కాజాలవు. దృఢమనస్కులులేని స్వాతంత్ర్యము నీటి బుగ్గవంటిది.

శాంతము, గభీరమునైన భారతనీలాకాశమున మాన వాంగుష్టమాత్రముగ నొక మేఘము కాన్పించవచ్చును. కాని యది యేనాడు ఎట్టి ఘనఘనారావ ఘోరజీమూత సంకులమగునో యెవరికెఱుక !

శాంతముతో కూడిన సత్యమే జయము.

సానిమెరుగులు, సంతమెరుగులుపెట్టి కొన్ని మార్పు లను కలిగించినంత మాత్రముచే నది ప్రజాస్వామిక ప్రభుత్వము కాజాలదు. ప్రభుత్వహృదయము మారినగాని లాభములేదు

స్వాతంత్ర్యప్రాప్తి కొరకు మన మెవరియాజ్ఞకొరకును దోసిలొగ్గవలసిన పని యెన్నడును లేదు.

స్వరాజ్య మన రామరాజ్యము. ప్రపంచమున ధర్మ రాజ్యమును స్థాపించుటే దాని యర్థము.

స్వాతంత్ర్య మెప్పుడును జయిలుగోడల మధ్యను, యొక్కొక్కప్పుడు యురిస్తంభముల మీదను మాత్రమే వరింప బడుచుండును. అదెన్నడును పాఠశాలలలోను శాసనసౌధముల లోను దొరకనేరదు.

స్వేచ్ఛావర్తకము హిందూదేశమునకు పెనుభూతమై దానిని శాశ్వతదాస్యమున పడవైచెను.

స్వాతంత్ర్యమును సంపాదించుటకు మనము చనిపోవు వరకును కష్టముల నెదుర్కొనుటకు సంసిద్ధులము కావలెను. శరీరమును దాచుకొనువాడు నశించును.

స్త్రీలు తమ విదేశవస్త్రముల నన్నిటిని పూర్తిగ విడిచి పెట్టినగాని విదేశవస్త్ర బహిష్కరణము పూర్తికానేరదు.

సత్యాగ్రహ రంగములో ప్రజల తప్పిదములే లెక్కకు వచ్చును.

స్వాతంత్ర్య తరంగముల నుద్బోధింపజేయు గురువర్యుల మ్రోల తరుచ్ఛాయలందుకాని, నిరాడంబరమైనను మనోహర మైన కుటీరవాకిటలనుగాని మన బాలురు స్వేచ్ఛా వాతావరణ మును గ్రోలుచుండుట యెంతయు త్తము !

స్త్రీల సుగుణసంపత్తి, కరవు కాటకములనుండి కాచు కొనుట, ధరలు తగ్గుట — ఇవన్నియు వడుకుపరిశ్రమలో నిమిడి యున్నవి

స్వరాజ్యమనగా అధమము దేశముయొక్క ఆర్థిక జీవనమునకు ఊపిరితిత్తులవంటి దేశీయ పరిశ్రమలను సంరక్షించుకొనుచు వానిని భంగపరచు విదేశదిగుమతులను నిరోధించు శక్తియేయని గుర్తెరుగవలెను.

హిందువులకు గోవు ప్రాణతుల్యము. కనుక మహామదీయులైచ్ఛికముగ తమ తోటిహిందువులతో సమరస భావమునకు రావలెను.

హిందూ మహమ్మదీయ ఐక్యత కుదరనిచో మన కాచంద్రార్కము బానిసత్వము తప్ప వేరేమి కలదు?

హిందూ మహమ్మదీయులు పరస్పరానుమాన వీక్షణములను వీడి ఒకరికొకరు అన్యాయములను గావించుకొనుట యసంభవమని విశ్వసింపవలెను.

హిందూదేశము కత్తిని చేబట్టి తాత్కాలిక జయమును పొందినను పొందవచ్చును. కాని నా హృదయమట్టి భారతదేశ సందేశమునకు గర్వింపజాలదు.

హిందూదేశమునకు బోల్షివిజము అవసరములేదు. అరాచకమును భరించుటకు ప్రజలు అతి శాంతయుతులు. మనకిప్పుడు బాహ్యమునకు గాన్పించు ఏదోయొక క్రమము నెవరు తేగలిగినను సరే వారికి ప్రజలు తలయొగ్గెదరు.

హిందువులు అస్పృశ్యతను తీసివేయలేని ఒక్క వత్సరము కాదుగదా నూరేండ్లకైనను మనకు స్వరాజ్యము లభింపనేరదు.

హిందూదేశము దినదినము దారిద్ర్య భూయిష్టమగు చున్నది. ఆమె పాదముల దగ్గరనున్న రక్తప్రవాహమంతయు కొంచె మించుమించుగా కట్టువడినది. ఇప్పుడైనను మనము జాగ్రత్తను తీసికొనమేని అది త్వరలో మృతి నొందగలదు.

హిందూమహమ్మదీయుల మధ్య కలుగు కలహములకు కారణము ఒకరి అభిప్రాయము లొకరిపై రుద్దుటకు ప్రయత్నించుటయే. ఉభయులమధ్య ఐకమత్యము కలుగవలెననిన ఒకరియెడల నొకరు మతసహనమును విశ్వాసమును కలిగి యుండవలెను.

హిందూమతమునందు జన్మించిన యే మానవునైనను అస్పృశ్యుడనిగాని మైలపడినవాడనిగాని ఎంచుట మహాపాతకము. అట్లుచేయుటకంటె రాక్షస కృత్యము మరొకటిలేదు.

హైందవ జాతీయత స్వార్థపరమును అహంకారపూరితమును వినాశకరమును అయినదికాక ఆరోగ్య ప్రదమును ధర్మపూరితమును ప్రేమకు నిలయమైనదియును నయియున్నది.

స్వరాజ్య సంపాదనామార్గమునకు హిందూదేశము దౌర్జన్యసూత్రమును అవలంబించెనేని స్వరాజ్యము చేకూరక పోవుటయేగాక ప్రచ్ఛన్నదాస్యమునకు లోనగును.

హిందూదేశము ఇంగ్లీషువారి స్వలాభముకొరకే పాలింపబడుచున్నది. హైందవ జాతీయతాభివృద్ధి కొరకది గొప్ప యడ్డంకు. ప్రత్తివ్యాపారముపై వారికున్న అభిమానము చాల సాంప్రదాయ విరుద్ధము. కనుకనే అది జాతీయాభివృద్ధికి పరమ శతృవు. విదేశవస్త్ర బహిష్కరణము ఇంగ్లీషువారికే గాక విదేశీయులందరినోట దుమ్ము కొట్టినదగును.

హిందువులైన మనమేరినిగాని నీచులని, తక్కువ వారని, దోషులని తలంచరాదు. పంచములను అస్పృశ్యులనుగా జూచుట మానవలెను.

హిందూదేశముయొక్క ఆర్థికసంపత్తు పదిహేనువందల సంవత్సరములనుంచి నదీప్రవాహమువలె కొట్టుకొనిపోవుచున్న విధమునుజూచి యెంతకాలము సహించి యూరకుందుమో లేక ప్రోత్సాహము చేయుదుమో అంతకాలము హిందూదేశము స్వాతంత్ర్యమును పొందజాలదు. విదేశవస్తు బహిష్కరణమునకు ప్రధానాంగము విదేశవస్త్రబహిష్కారమే.

క్షమించుటయన మరచిపోవుటకాదు. స్నేహితుడు కాడను సంగతి మరచిపోయి మనమొక శత్రువును ప్రేమించుటలో ఘనతలేదు. మనము మన శత్రువునే ప్రేమించుచున్నాము అను పూర్ణజ్ఞానముతో ప్రేమించుటలోనే ఘనత యున్నది.

# రా చ కీ య ము లు



ప్రజల యనుమతిమీాదను వారి కోరికల ప్రకారమును జరుగుచున్నంతవరకు ప్రభుత్వము ప్రజాసేవచేయు సంస్థయే యగును. కాని సన్నిపోట్లతో ప్రజలను లొంగదీసికొన జూచు ప్రభుత్వము రాక్షసరూపమును దాల్చును.

నేను జ్ఞానజ్యోతిని సరిగాగ్రహించి ఆ యాదేశము నాచరణకు తెచ్చితినేని ధన్యుడనగుదును. నాతోటివారు ఏ కొంత మందియైనను రాగలిగిరేని నాకంతకంటె కావలసినదేమియులేదు.

ఈ సామ్రాజ్యముయొక్క ప్రస్తుత ప్రతినిధులందరును అన్యాయ ప్రవర్తనకు దిగిరి; వారు గుండెలుతీసిన బంట్లు. వారికి ప్రజలకోరికలపట్ల ఆవంతయు గౌరవములేదు. భారత గౌరవమును వారు తృణప్రాయముగ జూతురు.

ప్రతి పౌరుడును తనకు తెలియకపోయినను ఏదో విధముగ ప్రస్తుత ప్రభుత్వమునకు సహాయమును చేయుచునే యున్నాడు. కనుక ప్రభుత్వ చర్యలన్నిటికిని వారందరును ఉత్తర వాదులగుచున్నారు.

ప్రజాభివృద్ధి కొరకే ప్రభుత్వము లేర్పడినవి. ప్రజాభివృద్ధిని జూడని ప్రభుత్వముకు ప్రజలు తోడ్పడనక్కరలేదు.

ప్రజాస్వామిక ప్రభుత్వములని పిలువబడుచున్న వన్నియు సంఘములోని దోషములను నిర్మూలముచేసి స్వర్గమును సృష్టించుననుకొంటిమి. కాని మధ్యయుగమునాటి సామంత రాజుల చట్టవిహీనమైన పరిపాలనలకంటె నివి మరింత అధ్వాన్న మయ్యెను.

ప్రస్తుత ప్రభుత్వమునకును మనము స్థాపింపబోవు దానికిని మధ్యకాలమున మనమనేక పొరపాటులను చేయ వచ్చును. కొంత అక్కరలేని బాధకూడ ఉండవచ్చును. జాతి యంతయు నిర్వీర్యమైపోవుటకంటె నీ పొరబాటులు మంచివికావా?

నిరపరాధుల రక్తప్రవాహమును గావించిన ప్రభుత్వ హస్తములనుండి యింద్రపదవి నొందుటకంటె నాకు భిక్షాటనమే మేలు.

అపరిశుద్ధ ప్రదేశములో జీవించు ప్రజలకు రోగములు తప్పనట్లు అధర్మప్రభుత్వములోని ప్రజలకు జయిలు జీవితము తప్పనిసరి యగును. అది వారి నిత్యావంట.

భారతమే నాతల్లి. నాసర్వస్వము ఆమె పెట్టిన భిక్షయే. ప్రపంచమున కామె యొక ఉత్కృష్ట సందేశమును గొంపోనున్నది. యూరపుదేశము నాపె గుడ్డిగా ననుకరింప జాలదు.

నిత్యదరిద్రతకు అగౌరవములకు పాలగుచు నా కొరకు చూచుచు నన్ను విశ్వసించు ప్రజలకు నేను మోక్షాదేశమును పురికొల్పగలను; కాని మోక్షము, ఆశ ఈ రెండును త్యాగము, శిక్ష, ఆత్మసంయమము లేనిదే కలుగ జాలవు.

కోర్టువ్యవహారములు జూదపు పందెములుగా భావింప బడుచున్నవి. ఇంతకన్న వేరు సత్యము లేదు. నీ కేసులో యెంత సత్యమున్నను, యెంత న్యాయమున్నను నెగ్గగలనని నీ వెన్నడును చెప్పజాలవు.

ప్రస్తుత న్యాయపరిపాలనా పద్ధతిలోని దుర్భర విషయ మేమన ప్రజలు చెప్పరాని యవినీతికి తేబడిరి. రక్తపాతము, మోసము, వర్తక దోపిడి - నీకివి యే పాశ్చాత్య దేశములలో కాన్పించుచున్నవి. కాని మానవలోక మంతయు నెమ్మదిగా నిమ్మకు నీరుపోసినట్లు సౌభాగ్యప్రదమైన నూతన యుగమును సృష్టించుటకే పనిచేయుచున్నది.

సామ్రాజ్యము హిందూదేశమున కేమిచేయుచున్నదో చూడుడు:—గ్రేటుబ్రిటనుయొక్క లాభము కొరకు మన దేశములోని పెన్నిధానముల నన్నిటిని కొల్లగొనుట; నిరంతరము పెరిగిపోవుచున్న సైనికవ్యయము; ప్రపంచములో నెక్కడను లేనంతటి వ్యయమును చేయుచున్న సివిలు సర్వీస ఉద్యోగములు; మనమధ్యనున్న కొద్దిమంది ఆంగ్లేయులక

ప్రాణహాని రావచ్చుననుభయమున జాతినంతను ఆయుధహీనముచేసి నిర్వీర్యముచేయుట; తలకుమించిన ప్రభుత్వ వ్యయములన్నిటిని పోషించుటకుగాను బుద్ధినాశనము గావించు మద్యము మొదలగు పానయోగ్యముకాని పానీయము, నల్లమందు మొదలగు వానియొక్క వర్తకము; జాతీయ మనోవ్యధను వ్యక్తము చేయుచు, పలస రాజ్యములలో మనము పొందుచున్న అగౌరవములను వెల్లడిచేయు జాతీయాందోళనము పెరుగకుండ అరికట్టుటకుచేయు నిరంతర నిర్బంధ శాసనములు ఇట్టి వెన్నిటినో పేర్కొనవచ్చును.

రాతియుగముకంటె ఉక్కుయుగము మంచిదను సంగతి నాకర్థముకాదు. నాకు రెండును సమానమే. మనము మన బుద్ధిని, మన సమస్తశక్తులను ఆత్మాభివృద్ధికే వినియోగించవలెను.

భారతజాతీయత యెన్నటికిని సంకుచితము, వినాశకరము, ఇతరులపైకి దూకునదికాదు. అది కళ్యాణమునొసంగు మతము; కనుకనే యది మానవకళ్యాణమునే కోరును.

ధైర్యము శరీర లక్షణముకాదు. అది మానసిక లక్షణము. కండలు పెంచినవారిలో నేననేకమంది పిరికిపందలను జూచితిని. దుర్బల శరీరములో ధైర్య సాహసములు మూర్తీభవించుట నేనెరుగుదును.

కలకత్తాలోని విలియముకోట తదితర మహాసౌధములు, నోరులేని విజ్ఞానధనులైన ప్రజలను నిష్కారణముగ కొల్లగొనుటను గాక మరేమి సూచించును?

ఇంగ్లీషువారికి దూరదృష్టియెక్కువ. వారు మనకు ఊరక న్యాయదానము చేయరు. మనలో వారిని ప్రతిఘటించు శక్తి-దౌర్జన్యశక్తి యగుగాక, దౌర్జన్య రాహిత్య మగుగాక-ఏదియైనను శక్తియున్నప్పుడే న్యాయమును కలుగజేసెదరు.

గడిబిడలను కలుగజేయు పత్రికలను, అసత్యములను ప్రచారముచేయు పత్రికలను ఎదుర్కొనుటకు మన మొక నూతన పద్ధతిని కనిపెట్టవలెను.

భారత దేశమునకు న్యాయమును కలుగజేయలేని సామ్రాజ్యమును నాశనముచేయుటే ప్రతి భారతీయునియొక్క విధాయక ధర్మమని యాంగ్లేయులు గుర్తెరుగుదురుగాక!

రైళ్ళు, ఆసుపత్రులు గొప్ప విశుద్ధ విజ్ఞానమును సూచింపజాలవు. అవి తప్పనిసరియైన దోషములు మాత్రమే యని మనమెరుగవలెను.

ఒక్కలక్షమంది ఆంగ్లయాత్రికులు 3000 లక్షల మంది గల జాతిని శాసించుటయనునది పాలకులకును పాలితులకును కూడ నీతి బాహ్యమగు విషయము, సిగ్గుచేటు.

హిందూదేశములో శాంతి, రాజభక్తి, వ్యక్తి అభిప్రాయములు, ఇవన్నియు విచ్చుకత్తులతో కాపాడబడుచున్నవి. ప్రజలుమాత్రమే నిరాయుధులు చేయబడిరి.

అధర్మమైన చట్టములకు తలయొగ్గుట మానవత్వము కాదని గుర్తించిన చాలును. ఎట్టి నిరంకుశత్వమును అట్టివారిని వశము చేసికొనజాలదు. ఇదియే స్వరాజ్యమునకు కీలకము.



# ఆర్థికములు.



స్వేచ్ఛావాణిజ్యము హిందూదేశమునకు మహాపకారమును చేసెను. అదిదానిని నిరంతరదాస్యములో ముంచివేసెను.

రాటము ఇతరదేశములతో వర్తకపోటీకి నిల్చుటలేదు. దేశములో వృథాగా పాడుచేయబడుచున్న జాతీయపాటును (National Labour) సేకరించుకొని నిత్యము పెరుగుచున్న దేశదారిద్ర్యమును తగ్గించుకొనుటే దాని ప్రధానోద్దేశ్యము.

ఆంగ్లచరిత్రకారులు వ్రాసినట్లు మాన్చెస్టరుగుడ్డలు మనదేశముపై బలవంతముగ ప్రవేశపెట్టబడినవి. ప్రపంచాధిక్యతను బడసిన మన డక్కా—మస్లినులు బుద్ధిపూర్వకముగ ప్రయత్నపూర్వకముగ నాశనము గావింపబడినవి.

నీతిని, ఆచారములను గణనసేయని ఆర్థికశాస్త్రము మైనపు బొమ్మవంటిది. అందులో ప్రాణమున్నట్లున్నను ప్రాణశక్తి శూన్యమగుచున్నది.

మన పట్టణములే హిందూదేశమని యెవరును మోసపోకూడదు. హిందూదేశము తన ఏడున్నరలక్షల పల్లెటూళ్ళలోనే జీవించుచున్నది. మన పట్టణములు ఆపల్లెటూళ్ళమీద జీవించుచున్నవి. అవేవియు తమ యైశ్వర్యమును యితరదేశములనుండి తెచ్చుటలేదు.

పట్టణవాసులందరును యూరపు అమెరికా జపానుల లోని పెద్దపెద్ద కంపెనీల కమిషనుదారులు, దళారీలు. గత రెండువందల ఏళ్ళనుండియు మనదేశమునుండి పోవుచున్న ధనప్రవాహమునకు వీరు పై వారితో చేతులు జోడించిరి.

ఇతరదేశములలోని పశువుల దుస్థితి మనదౌర్భాగ్యదేశ ములో నున్నంత కడుదీనముగలేదు. మనము దీనికి ఆంగ్లేయు లను దూషించ నక్కరలేదు. మనము దరిద్రులమను సాకును చూపనక్కరలేదు. మన పశువులు దుర్భరస్థితిలో నుండుటకు కారణము మన నిర్లక్ష్యభావమే. మనము వాటిపట్లను, దేశము యెడలను మహానేరమును గావించుచున్నారము.

ప్రతి పల్లెటూరులోను మనకు ప్రత్యక్షముగ కాన్పించు మానవ అస్థిపంజరములను ఎట్టి మాయావాదము, ఎట్టి లెక్కల తాంత్రికము బోకరించ జాలదు.

నేను చెప్పిన స్వదేశవ్రతమే నిజమైన ఆర్థికశాస్త్రము. ఆంగ్లేయుల ఆర్థికశాస్త్రమును అనుకరించుట మనకు నాశ హేతువగును.

యంత్రములు యూరపును నాశనము చేయుటకు మొదలుపెట్టినవి. నాశనదేవత యిపుడు ఇంగ్లాండుయొక్క తలుపులను తట్టుచున్నది.

హిందూదేశము పట్టణములను, యంత్రములను కోరలేదు. పురాతనరాటము, పురాతనవిద్యావిధానము భారత సౌభాగ్యమును, విజ్ఞానమును పెంపొందించినవి. అవి ఇంకను పెంపొందించ గలవు.

మనము కాంగ్రెసు ప్లాటుఫారములమీద యీ 35 వత్సరములనుండియు కావలసినంత వాగ్జాలమును వదికితిమి, భారతదేశమునకు నిజముగ కావలసిన నూలును మనమిప్పుడు తయారు చేయవలసిన సమయ మేతెంచెను. నిరుపేదల ఆకలి తీర్చుటకు, మానమును కాపాడుటకు మనకింతకన్న వేరు మార్గములేదని నాయభిప్రాయము.

మతమునకును రాచకీయమునకును సంబంధము లేదనుటలో అర్థములేదు. మతములేని రాచకీయము దహనము చేయవలసిన శవమువంటిది.

చెడుగు సత్పురుషుల ముఖమున మంచిగమారిపోవును. దుష్టబుద్ధుల ముఖమున గుణసంపత్తికూడ చెడ్డగనే పరిణమించును. దీనికి మనమాశ్చర్యపడ నవసరములేదు.

జలదములు సముద్రమునుండి క్షారోదకమును త్రాగును. కాని యవి సర్వసస్య ప్రదము, సుఖదములగు మధురాంబువులను ప్రసాదించుచున్నవి.

త్రాచు మధురములగు క్షీరములను త్రావుచున్నది. కాని యది తిరిగి భయంకరమగు విషమును గ్రక్కుచున్నది.

నదులు తమ నీటిని తామే త్రాగుటలేదు. వృక్షములు తమ ఫలములను తామే తినివేయుటలేదు.

మేఘములు తాముత్పత్తిచేయు ధాన్యసంపత్తు నెంత మాత్రమును ఆశించుటలేదు. అట్లే సత్పురుషులును తమ సర్వశక్తుల నితరుల మంచికొఱకే వినియోగింతురు.

మన దేశములోని యితర గొప్ప నాయకులతోపాటు నేనును సూచించు సంఘసంస్కారము లవలంబింప బడనినాడు హిందూమతము నశింపక తప్పదు.

మతము తనకును తనసృష్టికర్తకును సంబంధించిన విషయము. ఇతరుల కందులో నెట్టి ప్రమేయమును లేదు.

విశ్వాసము, ప్రార్థన నాకాయువుపట్టులు. నన్ను ముక్కలుగ్రింద కోసినను సరే భగవంతుడు లేడని నేనను. అంతేకాదు. అతడున్నాడనియే నొక్కి వక్కాణింపగల శక్తిని నాకతడు ప్రసాదించును.

హిందువులు శుద్ధి సంస్కారమని, మహమ్మదీయులు 'తబ్లీగు' అని, క్రైస్తవులు 'ప్రాస్లిటైజింగు' అని మతాంతరులను తమ తమ మతములలో కలుపుకొను పద్ధతికి నేను వ్యతిరేకు

డను. మార్పు హృదయమునకు సంబంధించిన సంస్కారము. అది భగవంతుని కొక్కనికే తెలియును. అతడొక్కడే దానిని తెలిసికొనగలడు. ఆ విధానమును దానంతట దానికే తెలియును. అతడొక్కడే దానిని తెలిసికొనగలడు. ఆ విధానమును దానంతట దానికే విడువవలెను.

నేను సంఖ్యలను జూచి మురియను. నాకు సంఖ్యలందు కంటె గుణమునందే విశ్వాసము కలదు. కాని నేడు గుణమును పోనాడి యైనను సంఖ్యమీద యాధారపడుట పరిపాటియై పోయినది. సంఖ్యకు సాంఘిక, రాజకీయ విలువ లేకపోలేదు. కాని ప్రస్తుతము జరుగుచున్న విధమున సంఖ్యాబలమును తయారుచేయుట మాత్రము నాకుచేతకాదు.

ప్రకృతి దుర్బలత్వమును నిరసించును. బ్రిటిషు ప్రజలును తక్కిన ప్రపంచమును మాపట్ల కరుణ చూపవలెనని మేము కోరుటలేదు. మేమెట్టి న్యాయమున కర్హులమో అట్టిన్యాయమే మాకు కావలెను. మేము శక్తివంతులమయి మా శక్తిని గుర్తించిననాడు న్యాయము జరిగియే తీరును.

వేషము, డాంబికము మతము కాజాలదు. మేధావంతుల మెదడులలో సేకరింపబడియుండు పాండిత్య ప్రకర్షయు మతము కాదు. హృదయమే మతమునకు మూలస్థానము. హిందువు లము, క్రైస్తవులము, మహమ్మదీయులము, తదితరులము —

లగు మనమంతరము మన విశుద్ధజీవితముల ద్వారముననే మన మతముల కర్థమును నిరూపింపవలెను.

పవిత్రత కృత్రిమపద్ధతుల ద్వారా వృద్ధిచెందునదికాదు. అది బలవంతముగ చొప్పింపబడుటకును వీలయిన విషయము కాదు. ఘోషాయను గోడలు దానిని రక్షింపజాలవు. అది యంతరంగమునుండి ప్రజ్వలింపవలెను. ప్రతి ఆయాచిత మోహమును తరింపని పవిత్రత నిజమైన పవిత్రత కాజాలదు. సీతయొక్క పవిత్రతవలె నది ధిక్కారమును చూపవలెను. పురుషుల చూడ్కులకు నిలువజాలని స్త్రీ యతి హీనురాలు. స్త్రీలు పురుషులను విశ్వసించునట్లు బలవంత పెట్టబడుచున్నట్లే పురుషులును పురుషత్వమును నిలుపుకొనవలెనన్న తమ స్త్రీలను విశ్వసింపవలెను.

ఆత్మ పారిశుధ్యము, ఆత్మ బలిదానము, స్వార్థత్యాగము అను పునాదులమీదనే సత్యాగ్రహ, జాతీయ నిర్మాణములు జరుగ వలెను. జాతిని దృష్టియందుంచుకొని నామట్టుకు నేనెట్లు పవిత్రవంతుడను కావలెను? అను ప్రశ్నను ప్రతివాడును తనకు తానే వేసికొనవలెను. వ్యక్తి జీవితము, శీలము పవిత్రవంతమగుటయే యీ పునాదికి ప్రాతిపదిక. నా వ్యక్తి జీవితము, శీలము దోషభూయిష్టముగ నుండుచో నేను 'ఓటికుండ డబడబ ధ్వనిచేయుడప్పు' వంటివాడను. కనుక నేను అంతరంగిక

ముగ కల్మష పూరితుడ నైనచో నేనీ నిమిషమందే నా యపవిత్రతను పోనాడి యాత్మార్పణ కర్హ మగు పాత్రనుకావలెను. ఈ కార్యమందు ప్రభుత్వము నాకు సహాయపడజాలదు; నన్ను అడ్డు పెట్టనుజాలదు. పవిత్రుడ నగుటకును, పతితుడ నగుటకును నాకు నేనే సర్వాధికారిని.

